శ్రీరస్తు.

# శ్రీమదద్వైతరహస్యము

అను

వేదాంత గ్రంథము.




ముముక్షుజన తారకంబగునట్లు

రెడ్డి-వేంకట సుబ్రహ్మణ్యము గారిచే

రచియింపంబడి

పోక్కల - వేంకట నరసింహారావు నాయనిచే

పరిష్కరింపంబడి ప్రచురింపంబడియె.

చెన్నపురి:

26 పాపమ్మ స్ట్రీట్

కా. నరహరి నాయనిగారి

శ్రీహరి ముద్రాక్షరశాలయందు ముద్రింపంబడియె.

1893 సం॥ నవంబరు నెల.



వెల ... అణాలు.

శ్రీమద్గురు పాదారవిందాభ్యాంనమః.

# శ్రీ మ ద ద్వై త ర హ స్య ము.

నేను చిన్నతనమునుండియు శ్రీమద్వేదాంత సారామృత పాన పర వశులగు సాందీప-శ్రీకృష్ణ-శ్రీధర-చిన్నగురు-భీమగురు - సుందరరామగురు- శ్రీశంకరాచార్య- వేమన- శివరామదీక్షిత- శ్రీమదప్పయ -దీక్షితాది గురుపరంపరాగత ప్రభావాతిశయములగు జగద్గురు విశ్వనాథావధూత స్వాములవారి పాదపద్మ సన్నిధాన సన్నివాస సత్ప్రభావంబున దూరీకృత సకలదురితుండనై యమ్మహామహునిచే నించుకబోధితుండనై తదీయ గురువర స్నేహ ప్రవర్ధిత జ్ఞానదీపాంకురంబున నాకన్నయర్థంబు నాస్నేహ బృందమునకుఁ దెలియఁజేయుట యుక్తంబనియెంచి నాకుండోచిన పగిది సకలముముక్షుజనతారకం బగునట్లు వేమనాదులు చెప్పిన పద్యముల వడువునఁ బద్యరూపమునఁ జెప్పినఁ బాఠకులకు బహూపయోగంబుగ నుండునని తేట తెనుగు మాటలతోఁ గొంతగ్రంథమువ్రాసి యస్మద్గురు వరులచేఁ బరిష్కరింపించి తదాజ్ఞానుసారముగ నిపుడీ గ్రంథమును బ్రచురపఱచి నాఁడను. సజ్జనులిందలి సారముచే గ్రహింతు రని నమ్ముచున్నాఁడను.

రెడ్డి - వేంకట సుబ్రహ్మణ్యము.



శ్రీరస్తు.



శుభమస్తు - అవిఘ్నమస్తు.

శ్రీరామమూర్తయే నమః.

శ్రీగురు చరణారవిందాభ్యాన్నమః.



# అద్వైతరహస్యము.

క॥ శ్రీలక్ష్మీశ జనార్దన । పాలిత వరభక్తజాల భావనలోలా । చాలిత దుఃఖసమూహా । శ్రీలాలిత హృదయధామ శ్రీరఘురామా॥ (౧)

గీ॥ శ్రీరమానాథ గురువర చిన్మయాత్మ । వరద వైకుంఠ వామన వాసుదేవ । అచ్యుతానంద గోవింద హరి ముకుంద । నిన్ను దలంచుచుం గృతిసేతు నిర్మలాత్మ॥ (౨)

గీ॥ రక్తసిత కృష్ణరుచి నేకయుక్తిమెప్పి । బ్రహ్మ రుద్ర రమేశులై పరగుచున్న । త్రిపుటికవ్వల మెఱసెడు తేజమెంచి । దీనికంటెఁ పరంబైన వానినెంతు॥ (౩)

గీ॥ దేహ్రామందు నటించు నాసోహమెంచి । పంచకళలకు నవ్వలి పరముగాంచి । దశవిధంబుల నాదముల్ దగభజించి । దానిఁదెలిపెడు తెలివినెంతయును దెలిసి । కృతియొనర్చెద గురునకుబ్రీతిఁగాఁగ॥ (౪)

గీ॥ బాల్యమున నాకుఁ దారక పరమ మంత్ర । జపము నేరిపి ప్రోచిన సద్గురుండు । క్షితిని నయ్యల సోమయాజి కులవర్యుఁ । డైనశ్రీపాపయార్యుని న భినుతింతు॥ (౫)

గీ॥ విశ్వనాథావధూతను వినుతి జేసి । పూజ లొనరించి మదిని సంపూర్ణభక్తి । వెలయగా దత్త దాలభోజములకు మ్రొక్కి । మరియు బుధకోటికెల్ల నమస్కరించి॥ (౬)

గీ॥ శ్రీకరంబుగ రెడ్డి వంశైక భూషణుండ నానెప్పు బ్రహ్మయాఖ్యుండు గనియె। నాత్మసతినైన శేషాంబయందు మమ్ము । బుత్రకుల నేప్వురను నొక్కపుత్రి నతఁడు॥ (౭)

గీ॥ అందు రెండవ వాఁడనై యలరుచౌఁడ । నవని వేంకట సుబ్బరాయుండ నంగ । నెగడు శ్రీరామభక్తుండ నిర్మలుండ । సముచితాద్వైత విద్యావిచారపరుఁడ॥ (౮)

ఆ॥ అయిన నామనంబునందు నీకంకితం । బొప్ప నట్టు లేను జెప్పఁబూని । యున్న పద్యసమితి మన్నించి వినుము శ్రీ। రఘుకులాబ్ధి సోమ రామనామ॥ (౯)

గీ॥ శ్రీగణాధీశ సురనుతు శేష భూషుఁ । పార్వతీసుతు విఘ్నేశుఁ బరమపురుషు । నేను మదినుంచి మిము నెంతు నిశ్చయముగ । రఘుకులాంభోధి సోమ శ్రీరామ నామ॥ (౧౦)

ఆ॥ ఇల్లుజొచ్చి కుక్కయిడిన డొంతులుగూల్చి।

నష్టిు కుకవి తప్పు లరయుఁ గృతిని । తప్పులున్నది
ద్దు దగసత్క వీంద్రుండు । రఘుకులాబ్ధి సోమ రా
మ నామ॥ (౧౧)

గీ। శ్రీకరంబుగ గురుకృపఁ జెందుకొంటి । రా
మనీమూర్తి మదిలోనఁ బ్రేమనిల్పి । పూజలొనరిం
చి నిన్నుచే బొగడుచుండు । రఘుకులాంబోధి సో
మ శ్రీరామనామ॥ (౧౨)

గీ॥ శ్రీకరంబైన బ్రహ్మంబుఁ జెందుకొంటి । స
ద్గురుస్వామి నామది సన్నుతించి । గీతత్రిశతిని జె
ప్పెదఁ గీర్తి మెఱయ । రఘుకులాంబోధి సోమ శ్రీ
రామనామ॥ (౧౩)

గీ॥ పంచవింశతి తత్త్వముల్ బరగఁజూచి । ధరణి
షడ్వింశకుని మదిఁదలఁచి మ్రొక్కి । పరమపథమైన
బ్రహ్మంబు బయలుసేతు । రఘుకులాంబోధి సోమ
శ్రీరామ నామ॥ (౧౪)

గీ॥ ఆత్మతానన్న భావంబు నరయలేక । యొండ
వాకల మంచున సేపుదరిగి । వాయువునుఁ బట్టి
కూర్చున్న మాయదెగునె । రఘుకులాంబోధి సోమ
శ్రీరామ నామ॥ (౧౫)

ఆ॥ ఆత్మమంత్ర మహిమ యాత్మయందగలియు ।
బాహ్యమంత్ర మహిమ ప్రకృతిఁ గలియు । బా
హ్యమంత్ర మిపుడు పరమని జూచితి । రఘుకులాబ్ధి
సోమ రామ నామ॥ (౧౬)

అ॥ ఆగ్గురులు గెంటియాత్మ తత్త్వంబుఁదా ।

రరయలేనిమనుజులవనిలోన । ముక్తిగనక మోహాసక్తులై చెడుదురు। రఘుకులాబ్ధిసోమ రామనామ॥ (౧౭)

ఆ॥ దశవిధేంద్రియముల వశముసేయక యున్న। శశిని బోలు జ్యోతివశము చేరఁ । దద్విధంబు నీదుదయ లేక గల్గునే । రఘుకులాబ్ధి సోమ రామనామ (౧౮)

ఆ॥ రాజగుహ్యమైన రాజయోగంబును। శ్రోత్రియులు పలుకలేక। యడవిజిరుగఁ దిరుగ నందవచ్చునె ముక్తి । రఘు కులాబ్ధి సోమ రామనామ॥ (౧౯)

గీ॥ రాజయోగంబు బూని నిరంతరంబు। మూఢు యోగపదంబుల ముక్తిగనని । తీర్థవాసులు మోక్షంబు తెరువు గనిరె । రఘుకులాంభోధి సోమ శ్రీ రామ నామ॥ (౨౦)

గీ॥ అవని ఖేచరి భూచరి యనగమధ్య । మంబనంగమణ్ముఖియు శాంభవి యనంగ । నైదు లక్ష్యములేఁ గన్నులారఁగంటిరఘు॥ (౨౧)

ఆ॥ సద్గురు ప్రసాద సరణిచే నీవైదు । లక్ష్యముల నెఱింగి లక్ష్యమొంద । వలయుగాని శాస్త్రవైఖరి గనరాదు ।రఘు॥ (౨౨)

ఆ॥ ముక్కు కనులు చెవులు ముకుళించి ద్వాదశాబ్జ । మధ్యమందు దృష్టి మలచి నిలిపి । చూడవణ్ముఖియన సాంపాందు ముద్రనైను ॥రఘు॥ (౨౩)

గీ॥ అంతరంగంబునందునిరంతరంబు। దృష్టినీక్షించు వారికిఁ దృష్టిదీర । నీదుపదమిచ్చి ప్రోతువు నిగమవినుత ।రఘు॥ (౨౪)

సీ॥ ఘనదివాకాశ మందున గానుపించు । ఘం
టవలె మ్రోయు రవముగా నుంటఁజెవ్రుల । వింటిన
నబ్రహ్మోపుమని వేఁడుకొంటినిన్ను ।రఘు॥ (౨౫)

సీ॥ అరయ నాదం బకారం బనంగ నొప్పు । మిం
చుకళను మకారంబటంచు దెలిసి । బిందువును కార
మంచు సంప్రీతిదలతు ।రఘు॥ (౨౬)

సీ॥ అరయ నీమూడు వర్ణంబులవ్వరఁగూడి యొఘ
నతరోంకార వర్ణంబుగాఁగనొప్పె । నట్టివర్ణంబునీవ
నియాత్మఁదెలియుదు ।రఘు॥ (౨౭)

సీ॥ ప్రణవనాద రసామృత పానరతుఁని । గనిన
యంతనె దోషముల్ గడచుఁగు । నంచుదర్శించు
చుందుగ్గ ముద్యావ్యవరులు ।రఘు॥ (౨౮)

సీ॥ కన్నుగవ దేశికుని యాజ్ఞఁగాంచియావృ। బో
మఁనముమ్ము వళద్వయా కమలమందు। దృష్టినిలుపుచుఁ
గాంతునీ తేజమచట ।రఘు॥ (౨౯)

ఆ॥ రెండుపాకు లెపుఁను రేబగల్ భ్రూమధ్య ।
దేశమునకు మలచి తేజముఁగను । చైత్యమెఱుగువా
రికది గదా మోక్షఁబు ।రఘు॥ (౩౦)

ఆ॥ అరసి చూచుచుఁటి నాకాశపంచకా । ద్యం
తరమున నున్న హంస మహిమ । నిట్టిపరమ హంస
మీావని పట్టితి ।రఘు॥ (౩౧)

ఆ॥ ఫాలమునను దృష్టి బాగుగా నిల్పుచు । క
నులమిత్రవహ్ని కమలవైరి । మండలముల నడుమ
నుండిన నినుఁజూతు ।రఘు॥ (౩౨)

ఆ॥ అట్టి మండలత్రయాంతరమున నిండు। చంద్రమామ పోల్కి నందముగను। వెలుగుచుండు నిన్ను వినుతింతు నేత్రాద్దు ।రఘు॥ (33)

గీ॥ వసుధనివ్వరిములువలె నసదుగనుచు । పీతమైయణురీతి నొప్పెడు వెలుంగు । జూతునని శంబు నవ్యయసుఖముఁ గోరి ।రఘు॥ (38)

ఆ॥ హంస మార్గమెప్డు డరసి శోధింపక । యడవులను జరింతురజ్ఞులెల్ల । నుఱకె తిరుగగా నెట్లొరుకునా మోక్షంబు ।రఘు॥ (3౫)

ఆ॥ బిందువనిన బుద్ధివృత్తి దాదీపింప । ఛందనాద దశకమరయఁ దోచు।ఏనివలన కళయువిశదమై కాన్పించు ।రఘు॥ (3౬)

ఆ॥ హంసతత్వ మవనినభ్యసించిన వారి । యఘము లుడిపి రవిసుఖాప్తి నొసఁగు। నట్టిసుఖముగోరరక్కటా జనులేమొ ।రఘు॥ (32)

ఆ॥ సోహమనిన పల్కు శోధింపరజ్ఞులు । పరము దమకు నెట్లుబడయవచ్చు । దాని యర్థమెపుడుఁ దలపోయ లేకున్న ।రఘు॥ (3౮)

ఆ॥ ఆరు కమలములను హంస వర్తించును । వెలయు నిర్వదొక్కవేల యారు । నూరుమారులట్టి నీ రహస్యముగంటి ।రఘు॥ (3౯)

ఆ॥ మొదటి చక్రమహిమ ముదముతో జూచిన । వశపసాక్షరముల వరలునందు । నెనగు గజముఖుండనీవె కాఁదలతును ।రఘు॥ (౪౦)

గీ॥ ఆరు రేకులతోడుత నమరి రక్త। కాంతి జెలు
వొందు రెండవ కమలమందు। పద్మజుండన వెలు
గొందు ప్రభుడవీవె।రఘు॥ (౪౧)

గీ॥ దశదళోపేతమై చూడ దనరు నాభి। కమల
మదియును ఘణిపూరకంబన్నంగ। నందు విష్ణుస్వరూ
పుండ వగుదు వీవె।రఘు॥ (౪౨)

ఆ॥ పదునైదు రేకు లెసగుచున్నుండును। నాహ
తాఖ్య మెరయునట్టి యబ్జ। మందు రుద్రమూర్తి వగు
చు క్రీడింతువు।రఘు॥ (౪౩)

ఆ॥ ఆరుపదియు రేకులమర కంఠప్రదే। శమున
వెలయు శుద్ధ కమలమందు। నాత్మరూపి వగుచునల
రెదు నీవు గొల్తు।రఘు॥ (౪౪)

గీ॥ రెండు రేకులతో గూడి నిండు రుచుల। నెగ
డు భ్రూమధ్య కమలకర్ణికను జెలంగు। నట్టి పరమా
త్మవీవని యభినుతింతు।రఘు॥ (౪౫)

గీ॥ బ్రహ్మరంధ్రమునను సహస్రారమగుచు। బ్ర
జ్వరిల్లెడు చక్రాంతరంబునందు। ఘనత గురుమూర్తి
నై యొప్పు నిను భజింతు।రఘు॥ (౪౬)

గీ॥ ఆ సహస్రార చక్రమందరసి చూడ। సూర్య
చంద్రాఖ్య నాడులు సొంపుమీర। గుడి నెడమగూ
డి వర్తించుచుండుతులివియె।రఘు॥ (౪౭)

ఆ॥ అర్కశశుల నడుమ నాత్మస్వరూపమై। మె
రయుచుండు బ్రహ్మమనుదు మీఱ। యాదిసుషుమ్న
యంచు నభినుతింతురు బుధుల్।రఘు॥ (౪౮)

ఆ॥ అజప హంసలోన ననిశంబు శోభించి। ద్వి
దళకమలము నను గుదురు కలది। నీదుపాదయుగ
ము నేనిదెపూజింతు ।రఘు॥ (౪౯)

గీ॥ అంగమునను న్న యాభింపు వరసిచూడ। లిం
గమందున నాదంబు లీనమైన। తత్కృతానంద మీా
వనితలపుఁగంటి।రఘు॥ (౫౦)

గీ॥ హరికళాధ్వనుల హరహామాత్మఁ గూర్చి।
రూపమొక్కటిగాఁ జేసి రూఢికలది। తాన్మస్వేవస్థ
చుఁ దెలిసితిఁ దలపులోన ।రఘు॥ (౫౧)

గీ॥ సాంఖ్య యోగంబు। దల్లప నిస్సంశయ్యుబుఁ
గూర్పకమనస్క భావంబు జేర్పరాదు । గానఁ దన్మా
ర్గమునఁ దానిఁగాంతు మదిని ।రఘు॥ (౫౨)

గీ॥ నిర్భరంబుగ బుద్ధిని నిల్పిజూడ । రేమిపా
పంబువచ్చునో యేమిపోనో। చూడఁజూడ గనిను
ను జూతురు గద ।రఘు॥ (౫౩)

ఆ॥ ఆరుమూడుగట్టి యమలతత్త్వముఁ గాంచ।
కష్టపెదూఁదు రకట యజ్ఞజనము। లారుభావమునను
నడగింప నేరరో ।రఘు॥ (౫౪)

ఆ॥ అంతరంగ నిలయు నాత్మునిఁ జూడక। చిం
తయనెడు నడవిచిక్కుపడుట । వింతకాదెనిన్ను వె
దుక లేరజ్ఞులు ।రఘు॥ (౫౫)

ఆ॥ అనిలమానసముల హంసనుఁగూర్చియు। నె
ప్పుడజప సూత్రమెఱుఁగ రకట । యెఱుఁగకున్న
నెట్లుఁదొరకును మోక్షంబు ।రఘు॥ (౫౬)

# అద్వైతరహస్యము.

ఆ॥ పరమగురుని పాద సరసిజంబులు జేరి । వా
దభేదములను వదలి బ్రహ్మ । నాదమాలకించి మో
దమందఁగవలె ।రఘు॥ (౫౭)

ఆ॥ ఈరహస్య మెఱుఁగకే పోకఁబోయినఁ । జి
త్తశుద్ధిగాదు చింతబోదు । పెక్కుత్రోవలున్న । ని
క్కంబుగనవలె ।రఘు॥ (౫౮)

ఆ॥ చింతవ్రావకున్న జిక్కునా మోక్షంబు చిం
తయ్యనెడు కాననాంతరమునఁ । గామ మృగముచేత
గ్రసింపఁబడుఁగాని ।రఘు॥ (౫౯)

ఆ॥ అనిలమానసముల హంసను గూర్పనై । యా
రుచక్రములను ననవరతము । నాడుచున్నయట్టి హం
సంబు నీవెకా ।రఘు॥ (౬౦)

ఆ॥ పూరకంబులోన పొందు హకారంబు । కుం
భకంబు బిందుకూటమయ్యె । రేచకము సకార సూ
చకమాఁగదా ।రఘు॥ (౬౧)

ఆ॥ పలనాస్తులుడిగి నీలతో యదమథ్య । నిగమ
వీథినున్న నిన్నుఁగాంచ । రజ్జులాసలుడుగ కబ్బునా
మోక్షంబు ।రఘు॥ (౬౨)

గీ॥ అలసహస్రార మందున్న యట్టిపరముఁ । జూ
డనేరక శిలలందు జూచిరేని । మగుడజన్మంబు గల్గదే
మానవులకు ।రఘు॥ (౬౩)

గీ॥ పండువెన్నెలలోపల పరమమగుచు । నిండు
కున్నట్టి బ్రహ్మంబొకండ దాన । నైక్యభావంబుగాంచు
నయ్యార్య వరుఁడు ।రఘు॥ (౬౪)

గీ॥ వేయిజ్రేకుల నడుమను వెలుఁగుచున్న। కాంతఁజూడని వారికిఁ గలదెముక్తి। జూచువారిని జాలక వఁ జూతురకట ।రఘు॥ (౬౪)

ఆ॥ తర్కశాస్త్రశేవధిఁ దరచి శోధించిన। పరమపదము తనకు బట్టువడునె। యప్రతర్క్య మనెడు నాశ్రుతి దెలియక ।రఘు॥ (౬౬)

గీ॥ నీలతోయదాంతరమున జాలదీప్తి। మెఱయు సౌదామినీ వల్లి కరణి నుండు। నిర్గుణత్వంబె శ్రుత్యంత నిగదితంబు ।రఘు॥ (౬౭)

ఆ॥ పూర్వసాంఖ్యమెల్లఁబొలియించి యుత్తర। సౌమ్య సాంఖ్య యోగసరణిదెలిసి। పరముఁజూచువారు పరికింప యోగులు ।రఘు॥ (౬౮)

గీ॥ అంతరాంతర త్రిపుటిలో ననవరతము। జూచిశోధించి శోధించి చోద్యమంత।యదియ తానన్న వారలేయాత్మవిదులు ।రఘు॥ (౬౯)

గీ॥ దేహగేహాది మోహంబుఁద్రెంచివైచి। సోహమనియెడు నాగమసూక్తిఁ దెలిసి। కడకుగైవల్య పదవినిఁ గందురెపుడు।రఘు॥ (౭౦)

ఆ॥ నదులుమూటికవల నాతిఁజూచినవారు। కోతిపనులుసేయఁ గోరబోరు। జ్యోతిలోనగలసి జ్యోతితామగుదురు ।రఘు॥ (౭౧)

గీ॥ నాల్గురంగుల కావల నాఁతియుండు। నాఁతి నెఱిఁగినవారలు నీతిపరులు। నీతిలేకున్న జ్యోతిని జూతురెట్లు ।రఘు॥ (౭౨)

ఆ॥ పాపనంటియున్న పరముదాఁజూచిన। పా
పపుణ్యములను బాపుచుండు । పాపపుణ్యములను బ
రిమార్పఁబరమౌను ।రఘు॥ (౭౩)

ఆ॥ నీలమేఘమందు నిక్కంబుజూచిన । కాలయ
ముని బాధఁగడకుఁద్రోయు । మూలనున్న జ్యోతి
మేలుగాఁ బొందును ।రఘు॥ (౭౪)

ఆ॥ పలువు గాళ్లుదెచ్చి ప్రతిమలుగావించి । దే
వుడనుచు మ్రొక్క దేవుడగునె । దేహగేహపర
ముఁ దెలియనివారికి ।రఘు॥ (౭౫)

గీ॥ సప్తకోటి మహామంత్ర జాలమెల్ల । చిత్తవి
భ్రమమేకాని శివపదంబు । జేరనీదిది నిక్కంబు సా
రసాక్ష ।రఘు॥ (౭౬)

గీ॥ అవని మంత్రంబు లెన్నైన నభ్యసించి । చే
యుజపమున మతిమేమి జెందుముక్తి । యజప సా
రంబు గనవలెనంతెగాక ।రఘు॥ (౭౭)

ఆ॥ నాల్గుపాపలెపుడు నాటించి చూచిన । కో
టిసూర్యలోక్క చోటనిలిచి । నట్లువెలుగు దానికా
వల పరముండు ।రఘు॥ (౭౮

గీ॥ నాల్గురంగు లభివ్యంచి నాఁటియుండు । నాఁ
టి శిరమున నెక్కేటే కోటియుండు । కోటి శిరము
న జ్యోతితోఁగూడివెల్గు ।రఘు॥ (౭౯)

ఆ॥ దేహమునకు చివర దేహంబులోపల । దేవు
డలరుచుండు తేటగాఁగ।నట్టి తేటలోడ నైక్యమొం
దఁగవలె ।రఘు॥ (౮౦)

ఆ॥ నాసికంబు చివరనలిఁజూచువారికి । బ్రహ్మమ నగ దానె బట్టబయలు । తనరునట్టి బయల దాను నిల్వగవలె ।రఘు॥ (౮౧)

ఆ॥ నాదమాలకించి నాదముఁదూలించి । యట్టినా దమునకు నైక్యమెఱిగి । యెఱిగియుండునట్టి యెఱు క తాఁగావలె ।రఘు॥ (౮౨)

ఆ॥ వెలుగుకన్న పరము వెదుక వేరేలేదు । వెలు గుఁ జూచువారు వేత్తలరయ । వెలుఁగుజూడకున్న వేత్తలెట్లగుదురు ।రఘు॥ (౮౩)

గీ॥ రెండుపత్రములలోపల నిఁడియున్న । పండువె న్నెల జూచిన భక్తులకును ।కరతలామలకము మోక్ష కాంతయెపుడు ।రఘు॥ (౮౪)

ఆ॥ కుటిలోననున్న ఘనునిశోధింపక । నేంటిసే తురకటి కొంటెతపము।తత్వమెఱుగకున్న దక్కునే మోక్షంబు ।రఘు॥ (౮౫)

ఆ॥ పంచకళలమధ్య పరముఁశోధించిన । పంచకళల తోఁడఁబ్రజ్వరిల్లు । పంచకళల తుదను బట్టబైలె ప రంబు ।రఘు॥ (౮౬)

ఆ॥ చెట్టుకైవమనుచు క్షితినిదలంతురు । గుట్టుతె లియలేని యట్టిజనులు । గుట్టుపరము దెలుపు గురుఁ డు తాఁగావలె ।రఘు॥ (౮౭)

ఆ॥ నాదబిందు కళలనయముఁతోఁ జూడక । గు ట్టుతమకు నెపుడు పట్టువడునె । నాదబిందు కళల నాథునిఁగనవలె ।రఘు॥ (౮౮)

గీ॥ నీలతోయదమధ్య తానెగడుచున్న । ముక్తి కాంతనుజూడని మూర్ఖులకును । మోక్షమదిమెట్లు సిద్ధించు దీక్షలేక । రఘు ॥ (౯౯)

ఆ॥ ఉల్లమందుగురువునుంచిపూజించక । పలుపు రాళ్లకెఱిగిభంగపడిరి । పలుపురాళ్లతమకుఁ బరమెట్లు జూపునో । రఘు ॥ (౯౦)

ఆ॥ ఉల్లమందు శివుని యున్కిని దెలియక । తీర్థ యాత్రలందు తిరిగివట్టి । తీర్థములను గ్రుంకసార్థకం బెట్లగు । రఘు ॥ (౯౧)

ఆ॥ గురునికన్న శివుడు ధరణిలో లేడన్న । గుఱిని నిల్పిచూడగుట్టుగాగ । గురుడుపరుడుగలిసి గురుడు తానౌనయా । రఘు ॥ (౯౨)

ఆ॥ తారకంబుమాకు దక్కెనేడనుచును । ముఱి యుచుండ్రురెపుడుముక్తిగనక । తారకంబుజూడఁదా నె తారకమగు । రఘు ॥ (౯౩)

ఆ॥ హంసమంత్రమెప్పుడాడుచునుండును । నాసి కంబుకొననాటికొనుచు । నదియు తారకంబు నందరి కొక్కటా । రఘు ॥ (౯౪)

ఆ॥ ఇట్టి తారకంబు గుట్టులోఁ దెలియక । ఆత్మ విద్యతమకునబ్బెనెట్లు । లనుచు బలుకుచుండు రమ వస్కయోగులు । రఘు । (౯౫)

ఆ॥ ఇట్టితారకంబునింపుతో దెలిసిన । కర్మవితతు లెల్ల గడకుబాయు । కడకుబాయ నాత్మ కైవల్య మొం దును । రఘు ॥ (౯౬)

ఆ॥ ఇన్నియేలఁ జెప్పఁడే నొక్క కీలక । మాత్మ శుద్ధిగలిగి యఘములణఁచి । సోహమనుచుఁ బలుక శుద్ధతారకమగు । రఘు ॥ (౯౭)

గీ॥ ఎలమినీతారకంబును దెలియలేక । దశరథాత్మజుఁడని మదిదలచుచుందు । రట్టిభావన తారకంబవునె తలఁప । రఘు ॥ (౯౮)

గీ॥ అరయఁగఁద్రికూటమందుఁ దానంటియున్న । వాసుదేవుని మదిఁగనువారుగారె । బ్రహ్మవిదులిట్టి మర్మంబు బట్టబయలు । రఘు ॥ (౯౯)

ఆ॥ ద్విదళకమలమందు దివ్వెనుజూచిన । భక్తులరయగాన భవులుగారె । యిట్టిసూత్ర మెఱుఁగకేమో వచింతురు । రఘు ॥ (౧౦౦)

గీ॥ కళమునకుఁ గ్రిందిభాగంబు గనినవారు । మర్త్యలంచును జెప్పిరిమానివర్యు । లట్టినిశ్చయమాత్మలో నమరుటరిది । రఘు ॥ (౧౦౧)

ఆ॥ పరముబ్రహ్మమంచుఁబరికించిచూచెదు । వారెబ్రహ్మమనుట వసుధలోన । నట్టివానిఁజూడ నతఁడు తానె౯నయా । రఘు ॥ (౧౦౨)

ఆ॥ ముద్రలైదు మొట్టమొదటను గ్రహియించి । భద్రమైనవెలుగు బ్రతిభగాంచి । నిద్ర దెలియువాఁడు నిజమైనయోగియా । రఘు ॥ (౧౦౩)

ఆ॥ బ్రహ్మరంధ్రమునను బరగెడుకళలోన । నైక్యమొందినిన్నునచటనిలిపి । పూజసేతునన్ను బ్రోవుము సతతంబు । రఘు ॥ (౧౦౪)

నడిమినాళమందు నాటించిచూచిన। నిండుకళల తోడ నిలిచి వెలుగు ।నట్టి నిన్నుఁ జూచినైక్యంబు గాంచితి । రఘు ॥ (౧౦౫)

ఆ॥ సోహమనుచు నడచు సుస్థితిఁ దెలియక। సోహమనిన్నదానసుఖమదేమి। సుఖముగాఁగఁదోఁచు జూపును దుఃఖంబి ।రఘు॥ (౧౦౬)

ఆ॥ కారణ గురుచేతఁ గళనెఱింగినవారు గీము క్తి కాంతఁ జూచిమొదముఁజెంది। తుదకుము క్తి జెంది ధూర్జటులౌదురు । రఘు (౧౦౭)

ఆ॥ కంటిలోనమన్న కారణ గురుఁజేరి । దేహ మందు భ్రాంతిఁ దీసివేయఁ। కారణగురుమూర్తి క ళతాను బొందును । రఘు॥ (౧౦౮)

గీ॥ అరయ నారునుపాధుల నడఁచివైచి। యచ లభావంబు దాల్చినాత్మైక్య మెసఁగి । మనసుగ్గువి యించునతఁడె మర్మజ్ఞుఁడగును । రఘు॥ (౧౦౯)

గీ॥ అరయఁగృష్ణాండవర్ణత్రయంబులోన । నిం డియుండును బ్రహ్మాంబఖండముగను । నట్టిబ్రహ్మాం బు జూచిన నతఁడె గురుఁడు । రఘు॥ (౧౧౦)

ఆ॥ కాకిభావ కులకుఁ గల్గునాబ్రహ్మంబు ।రాక పోకగల్గి చీకుచుండ్రు । గానిపరముఁగాంచగాఁ జా లరెప్పుడు । రఘు॥ (౧౧౧)

ఆ॥ కాకిభావ మెదలి కాంతిని జూచిన । వారలె పుడు ముక్తిఁ జేరుచుందు । రనుచు బల్కెరెప్పుడా నారదాదులు ।రఘు ॥ (౧౧౨)

ఆ॥ పాపవిధులచేతఁ బరమును మఱచిరి । పాప
మణఁపకున్న పరముగలదె । పాపమణఁచికంటి పాపల
గనవలె ।రఘు॥ (౧౧౩)

గీ॥ పాపలోపల మెఱసెడు పరమపదవిఁ । గల
యఁ జేరరు నరులెప్పుడు గానలేక। గలయువారికి నెప్పు
డు గలుగుముక్తి ।రఘు॥ (౧౧౪)

ఆ॥ పాపలోన దూటు పఱగుచునుండును । తూ
టులోన నొక్క బోటియుండు । బోటిమాఁచిదాని నా
టియుండఁగవలె ।రఘు॥ (౧౧౫)

గీ॥ నాదమాలించి యాలించి మోదమంది । వా
దమెడలించి నాదంబు పాడుకొల్పి । గాథలను మాని
బోధచేఁ గంద్రు ముక్తి ।రఘు॥ (౧౧౬)

గీ॥ మూలసౌధంబు లోపల ముక్తికాంతఁ । జే
రి జీవుండు పరముదాఁ జెందు నిసుము । పరసవేదిని ప
సిఁడిగాఁ బఱగునట్లు ।రఘు॥ (౧౧౭)

ఆ॥ సోహమనెడి ఖడ్గమూహ తోడుతఁ దా
ల్చి । దేహమోహలతల దెగఁగ నఱికి । యహమణఁం
పకున్న నబ్బునా మోక్షంబు ।రఘు॥ (౧౧౮)

ఆ॥ పరమదీప్తినరసి పరికింప తరమౌనె । ధాత
కైన నతని తండ్రికైన । నొంతునను మది వెఱ్ఱిబిం తలఁ జె
డుదురు ।రఘు॥ (౧౧౯)

ఆ॥ కర్మవశముచేతఁ గల్గును జన్మంబు । కర్మవ
శముచేతఁ గాలమెనయు । కర్మవశము వదిలి మర్మం
బుఁ గనవలె ।రఘు॥ (౧౨౦)

ఆ॥ మూలకందమహిమమునిన్నైనఁ బోఁగను । పట్టి
నరులకెప్పుడు పట్టఁబడునె । గుట్టుదెలిసినట్టిగురుశిష్యు
లకుఁగాక । రఘు ॥ (౧౨౧)

ఆ॥ మూలసౌధమందు చాలగామెఱసెడు । జ్యో
తిఁగనక బ్రహ్మజాతిమగునె । జ్యోతిఁజూచువాఁడె
సూబ్రహ్మజాతుండౌ । రఘు ॥ (౧౨౨)

గీ॥ నీలతోయదమధ్యమం బోలినట్టు । జ్యోతి
యంచును గురుఁడునీను శ్రుతియుఁదెలుప । జూడనే
రరు సత్యంబు సూటిగాఁగ । రఘు ॥ (౧౨౩)

ఆ॥ నీటిజ్యోతిలోన నిండునీజగమెల్ల । జగతిజ్యో
తిలోనఁగలిగియుండి । నెగడుఁబెల్లఁజూచిజగమెల్లనీ
వంటి । రఘు ॥ (౧౨౪)

గీ॥ చూపులోపల మెఱసెడు జ్యోతివచ్చు ।
గాంచి నీయైక్యపదవి నేఁగాంచుకొంటిను । నిన్ను ధ్యా
నించి మదిలోన సన్నుతింతు । రఘు ॥ (౧౨౫)

గీ॥ నీలతోయదాంతరమున వసిల్చియున్న । స్వా
మివనుచును మదిలోన సన్నుతింతుఁ । గానసాయు
జ్యనీయుమిక్కగామొనర్పు । రఘు ॥ (౧౨౬)

గీ॥ జీవతనువుల మూడింటి చిక్కుదెలిసి । బ్ర
హ్మతనువులమూడింటి పద్ధతిఁగన । వీనికవ్వలిసాక్షి
వీవేకదయ్య ! రఘు ॥ (౧౨౭)

ఆ॥ నిష్కళంకమగుచు నిర్వికల్పంబునై । నిర్విష
యమునైన నిర్గుణంబు । గురుని కరుణదెలియుపరము
నీవనియెంతు । రఘు ॥ (౧౨౮)

ఆ॥ తెలివికన్నఁ బరము దెలియంగ లేదని। పర
మఋషిగణంబు బలుకుచుండు। బలుకుచుండి పర
ముబయలని చెప్పిరి।రఘు॥ (౧౪౫)

గీ॥ ప్రకృతికెప్పుడు ద్రష్టయై పలుగుచున్న। బ్ర
హ్మమరచేతిలోనిద్రై వ్యథలుచుండు। నడచుబలుకుదు
రెప్పుడు సార్వవరులు। రఘు॥ (౧౪౬)

గీ॥ ప్రకృతి కెప్పుడు ద్రష్టయై పలుగుచున్న। ద్రష్టసాక్షించి తాను తద్ద్రష్టననుచుఁ గన్నవారికి జ
న్మంబు సున్నయనిరి। రఘు॥ (౧౪౭)

ఆ॥ ప్రకృతి నెఱుఁగు ద్రష్ట వికృతి నెంచెడి ద్రష్ట
బ్రహ్మమెఱుఁగు ద్రష్ట పరమద్రష్ట। యట్టిద్రష్టఁ దెలి
య నట్టిదైతె పరంబు।రఘు॥ (౧౪౮)

ఆ॥ పలుకులోనివానిఁ బరికించి చూచిన। పలు
కఁన్ని బ్రహ్మపలుకులగును। పలుకులెఱుఁగు తెలివి
పరికింపరోగంబు।రఘు॥ (౧౪౯)

ఆ॥ పరముపరమనన్నఁ బరికింపఁ జేరేమి। పర
మఁజూడఁజూడ బట్టబయలు। ఇంతకన్న పరమ దే
లోకమునసుండు। రఘు॥ (౧౫౦)

ఆ॥ మాయవలన బుట్టుమహిమీద కర్మముల్। కర్మవలన బుట్టుకారణంబు। కారణంబు జన్మకారణం
బైయుండు।రఘు॥ (౧౫౧)

ఆ॥ కర్మకర్మయనిన కర్మలేనేలేదు। జన్మకన్న క
ర్మజగతి లేదు। జన్మ కర్మలడచు సరనుండె గుసుఁ
డుఁగా।రఘు॥ (౧౫౨)

ఆ॥ మాయమాయయనగ మహిమీద నెయ్య
ది । తన్ను బ్రహ్మమనుచుఁ దలపనియదె । తన్నుగని
న వారు దగమాయ గెల్తురు । రఘు ॥ (౧౫౩)

ఆ॥ పసిడినసువితతి బహురూపములఁ బోచి । ప
సిడి యైన కర్ణికఁ బ్రాణులెల్ల । దెలియఁగనిన బ్రహ్మ
తేజంబు గాదొకో । రఘు ॥ (౧౫౪)

ఆ॥ బట్టబయలు తన్ను బాగుగా శోధింప । నేర్పు
గల్గువాడె నిష్టపరుఁడు । నిష్ఠలేక బ్రహ్మనిష్ఠుడెట్లగు
నొకో । రఘు ॥ (౧౫౫)

ఆ॥ అచలభక్తికన్న నవనిలో లేదని । శుద్ధతత
త్వవేత్త చూచుచుండు । నెఱుక లేని వాడదేమి జూ
చుధరిత్రి । రఘు ॥ (౧౫౬)

ఆ॥ మహినిజ్యోతికన్న మఱియేమి లేదని । మౌని
జూచుచుండు మర్మమెఱిగి । మర్మమెఱుఁగు యోగి మా
యను జెందఁడు । రఘు ॥ (౧౫౭)

ఆ॥ తనదుపుట్టుముడికి తనువునుఁ దలపోసి। యో
ల్లమందు గురుని యూహఁజేసి । చూచువారికెపు
డు సూక్ష్మంబు బ్రహ్మంబు। రఘు ॥ (౧౫౮)

గీ॥ కల్లయని మాయమర్మంబు గనినవారు । మ
గుడవత్తురె జన్మకుమహికినెప్పు । డంచుఁబలు కుచు
నుందురయ్యార్యవరులు । రఘు॥ (౧౫౯)

ఆ॥ పాప పుణ్యములను బాపెడు వస్తువు । బట్ట
బయట నెపుడు గుట్టతోడ । నుండునంచుబలుకుచుం
దురు రార్యులు । రఘు ॥ (౧౬౦)

ఆ॥ పరము పరమటంద్రు పరము పేరేమి యా।
పరముఁజూచువారు పరులుగారె।· పరము తానట
న్నభావమే బ్రహ్మంబు । రఘు॥ (౧౬౧)

ఆ॥ సోహమనెడిగురుని సూక్తి నెఱింగియు।
దేహమన్న భ్రాంతిద్రెంచివైచి। చూడగల్గువారే సూ
రివర్యులటంద్రు । రఘు॥ (౧౬౨)

ఆ॥ శూన్యరూపమెపుడు సూక్ష్మబుద్ధినిజూచి।
యదియుభావమందు నైక్యపఱచి। యచలరూపమం
దిమ్మంతయు దానౌను । రఘు॥ (౧౬౩)

ఆ॥ బాహ్యభావమెల్ల బయల్గాఁజేసియా। బ
యలులోన తాను బయటనిలిచి। బయలుగనినవాడు
పరముతానేతాను । రఘు॥ (౧౬౪)

ఆ॥ శూన్యభావమెపుడు జూచినవారికిఁ। బరమ
భావమరయ బట్టబయలు। బట్టబయలు పరము బ్ర
హ్మంబుగనవలె । రఘు॥ (౧౬౫)

ఆ॥ ఏమిలేని దెఱిగి యేకంబుగాఁజేసి। శేషప
దవిఁదాను జెందవలెను। చెందకున్నఁ బరముఁ జెం
దుటదెట్లొకో । రఘు॥ (౧౬౬)

ఆ॥ శేషభావమెఱిగిచెందితిఁ దత్వంబు। శేషభా
వమిలనుఁ జేరగంటి। శేషభావముననె శేషమే ప
రమంటి। రఘు॥ (౧౬౭)

ఆ॥ బట్టబయటికన్న పరమువేరేలేదు। అదియు
గురువులేక యబ్బుటెట్లు। లనుచుఁ జెప్పుచుందు రా
ర్యులు ధరణిలో। రఘు॥ (౧౬౮)

ఆ॥ ఎఱుక యెఱుకటన్న నెఱిగెడి వస్తువు। మ
ఱవున ఱపటన్న మఱచియుంట। యెఱుకమఱపులేని
యెఱుకయే బ్రహ్మంబు। రఘు॥ (౧౯౯)

ఆ॥ ఎఱుకబయలుజేసి యేకంబుజేసిన। యది
యె మౌనివర్యులకైక్యపదము। అట్టిపదవిజేయు నట్టి
వాఁడె గురుఁడు।రఘు॥ (౧౭౦)

ఆ॥ వేదగహనమెల్ల వెదికిశోధించిన। పరమప
దముఁజూడఁ బట్టువడునె। తెలియసద్గురూప దేశం
బులేకున్న। రఘు॥ (౧౭౧)

ఆ॥ దేహమునకుఁ దుదను దేవుడు గనుపించు।
మోహరహితులైన మునులకెల్ల। సోహమంచివెలుఁ
గుజ్యోతిగనవలె। రఘు॥ (౧౭౨)

ఆ॥ ఎఱుకయెఱుకయంద్రు యెఱుకకుఁ బేరేమి।
యెఱుగుదృశ్యమెల్ల నెఱుకయగునె। గాన నెఱుకచే
తఁ గనవలెనాత్మను। రఘు॥ (౧౭౩)

ఆ॥ దృశ్యమెల్ల దెలిసి ద్రష్టనునిల్పియా। ద్ర
ష్టతానెయగుచు దృఢముగాఁగ। నిల్పిచూడఁజూడ
నెగడుద్రష్టత్వంబు। రఘు॥ (౧౭౪)

గీ॥ కామలోభమోహాదుల కార్యముడుపు। నెఱ
ుకయంచును బల్కిరి పరమమునులు। ఇంతకన్నను
నెఱుకతానెచటనుండు। రఘు॥ (౧౭౫)

ఆ॥ అవనిజలము వాయువగ్నియాకాశంబుఁ।
గుండు నెఱుకయంద్రు కుమతులాత్మ। నరయలేక
తుదకుయమబారిఁబడుదురు। రఘు॥ (౧౭౬)

ఆ॥ పరముబొందెననని బల్కెదరజ్ఞులు । పరమ నంగ దానిభావమేమి । పరమగురునికరుణఁబడయు దు హార్యులు । రఘు॥ (౧౭౭)

ఆ॥ ఎఱుక యెఱుకయంచు నేర్పరించెదరెందు। నెఱుకచూడ నెఱుగ నెవరివశము । ఎఱుకతా నెయ నుచు నెరుగుట బ్రహ్మంబు । రఘు ॥ (౧౭౮)

ఆ॥ ఎఱుకలోని యెఱుక నెఱిగినవారికి । నెఱుక లేకతా నె యెఱుకయగుచు। నెఱుక నెఱుగఁ జూడ నెఱుక యేబయలగు। రఘు॥ (౧౭౯)

గీ॥ బట్టబయలైన యీగుట్టు పట్టువడు నె । దిట్ట మైనట్టి గురుకృపఁ దెలివిగనని । వట్టిమానవ జాతికీ వసుధలోన ।రఘు ॥ (౧౮౦)

గీ॥ పరమ గోప్యంబిదే బట్టబయలటంచు । దరి మిజెప్పిన విన రేమి ధరణిజనులు । మాయ గృహమే ధి సుఖముల మరిగి మరిగి।రఘు॥ (౧౮౧)

ఆ॥ సర్వభూతములకు సమముగా వర్తించి । స ర్వభూతములకు సాక్షినను చు। దెలిసినట్టి తెలివి తి రమైన దేవుఁడౌ। రఘు॥ (౧౮౨)

గీ॥ జ్ఞానయోగంబు మాకును గలదటంచు । మ మత నెప్పుడువిరిగెడు మానవులకు తానుతానైన భా వంబుతరమె తెలియ ।రఘు ॥ (౧౮౩)

ఆ॥ మూడువేళలందు ముదముతోఁ గూర్చుండి। నిర్వికల్ప సరణి నెరపకున్న । ముక్తిపదవి తమకుము ట్టుటే యెటుదయా।రఘు॥ (౧౮౪)

ఆ॥ ఒట్టి మాటగాని యొక్కరైన దెలియరీ। గు
ట్టు దెలియులేనియట్టి నరులు। బట్టబయలుపరముపరి
కించి చూడరు। రఘు॥ (౧౭౫)

ఆ॥ నాదమహిమ దెలిసినాటి యుండినఁజాలు।
నదియు నచలమునకు నాస్పదంబు। నాదబిందు కళల
నాథుండుఁదానగు। రఘు॥ (౧౭౬)

ఆ॥ బాహ్యమయిన బయలు పరమని పరికించి।
యేహ్యగుణములెల్ల నెడలవిడిచి। చూడఁజూడబర
ము సులభసాధ్యముగదా। రఘు॥ (౧౭౭)

ఆ॥ వేదముల్లజదివి వేదాంత సారంబు। వెదకి
చూడలేక విప్రులుందు। రట్టిసార మెఱుఁగు నతడు
బ్రాహ్మణుఁడగు। రఘు॥ (౧౭౮)

ఆ॥ లోనఁజూడఁజూడ లోపలనే కాదు। బయ
లు చూడఁజూడబయలుఁగాదు। బయలులోనఁబరము
పరిపూర్ణమైయుండు। రఘు॥ (౧౭౯)

ఆ॥ తన్ను దెలియునపుడె తత్త్వంబు దెలియును।
తత్త్వమెఱిఁగి నపుడు తానెతాను। తానుతానటన్నఁ
దాబ్రహ్మమేయగు। రఘు॥ (౧౮౦)

గీ॥ తానుకాఁ గలయది గదా తత్త్వకంబు। తా
నుతానైన భావంబె త్వంపదంబు। అసిపదంబన్న నీ
రెంటికైక్యమగును। రఘు॥ (౧౮౧)

ఆ॥ దేహమందు నాసఁ దెంచినవారికి। సోహ
మనెడి గుఱుతుసూక్ష్మముగను। దొరకుచుండుననుచు
నెఱుఁగరుజనములు। రఘు॥ (౧౮౨)

ఆ॥ పరము పరమనంగ పరదేశమున లేదు । భ్రాం
తులుడిగి చూడఁ బరము బయలు । భ్రాంతులుడగకున్నఁ
బరమెట్లుగాంచును । రఘు ॥ (౧౯౩)

ఆ॥ మూల ప్రకృతిఁ జూచి మూలంబు బయలని ।
మూలసౌధమందు ముద్రితఁ గూడి । యాడుపాడువార
లచలంబుగందురు । రఘు॥ (౧౯౪)

ఆ॥ బట్టబయలటంచుఁ బలుకుమాత్రమె కాని । బట్ట
బయలు చూడ బ్రహ్మాంతరము । గుట్టు దెలియువారు కో
టికొక్కరుగదా । రఘు ॥ (౧౯౫)

ఆ॥ బట్టబయలు బ్రహ్మభావంబటంచును । నిశ్చ
యింపలేరు నిష్ఠలేక । నిశ్చయించువారు నిర్గుణు లే
కగా । రఘు ॥ (౧౯౬)

ఆ॥ ఎఱుకయున్నచోటు నేర్పడ దెలిసిన । జనన
మరణములను గనఁగఁబోడు। ఎఱుక తానసైన మెఱు
కెఱుంగుటమేలు । రఘు ॥ (౧౯౭)

ఆ॥ కట్టెలోన నిప్పు గల్గిన రీతిని । తిలల తైల ముం
డుటీరుగాఁగ । దేహమందు నాత్మ తేజరిల్లుచునుండు
। రఘు ॥ (౧౯౮)

ఆ॥ పాలయందు ఘృతము పరగిన రీతిని । నాళమం
దునున్న నభమునట్లు । మాయయందు నాత్మ మఱు
గుగనుండును । రఘు ॥ (౧౯౯)

ఆ॥ అందఱందుఁ జూడ నాత్మయొడుగన్పించు । కొం
డఱం దెయనెడు కొరతతీరి । యెఱుక నిండునప్పుడేర్ప
డు బ్రహ్మంబు । రఘు ॥ (౨౦౦)

ఆ॥ నాదమెడలకున్న లేదు బ్రహ్మముకాన్న। పాదమెడలకున్న వచ్చుబ్రకృతి। పాదనాదములను వదలినముక్తుడౌ। రఘు॥ (౨౦౧)

ఆ॥ ప్రకృతి వికృతులగని పరమని భ్రమయేల। ప్రకృతివికృతులందుబ్రహ్మముగలదె। ప్రకృతివికృతులూడ్చిపరికింప బ్రహ్మమౌ। రఘు॥ (౨౦౨)

ఆ॥ అచలతత్వ మహిమయాచ్ఛల కెఱుకగు। పరమలోభులకును బట్టువడదు। తన్నుదెలిసి తెలియ తానుతానెపరమ్ము। రఘు॥ (౨౦౩)

ఆ॥ అచలమైనవస్తువంతటబూర్ణమౌ। పరముజూచినట్టి భక్తజనుల। కంచు బలుకుచుందు రార్యజనంబులు। రఘు॥ (౨౦౪)

ఆ॥ తనువు వెలినిలోనదగబూర్ణమైయొప్పు। పరమమైనవస్తువరసిచూడ। గడవవెలినిలోనె గగనంబు చాటుపగ। రఘు॥ (౨౦౫)

ఆ॥ పరముజూడ బట్టబయలగుచుండంగ। ముక్కుచెవులు మూసి నిక్కిచూచు। నిక్కిచూచునంతఁ జిక్కునా మోక్షంబు। రఘు॥ (౨౦౬)

ఆ॥ భూతపంచకమునబుట్టినదేహంబు। బొలియుననుచు శ్రుతులు దెలుపుచుండు। నెంత జెప్పుచున్న నేమొకో యెఱుగరు। రఘు॥ (౨౦౭)

గీ॥ మాయతాననుభావంబు మర్మమెఱిఁగి। సచ్చిదానందరూపాత్మ సంజ్ఞదెలిసి। బయలుదేరినవారలు బ్రహ్మవిదులు। రఘు॥ (౨౦౮)

ఆ॥ మాయ మాయయున్న మహిని వేరే లేదు। దృశ్యమెల్లనిజము నశ్యమగుట। దృశ్యనశ్యసాక్షి దృఢమైన బ్రహ్మంబు। రఘు॥ (౨౦౯)

ఆ॥ దృశ్యమంత దెలిసి దృక్కుగానిల్చును। దృక్కు కెపుడు ద్రష్ట తెలివిఁగనుచు। నట్టిద్రష్టతాను నచలంబు ననుబొందు। రఘు॥ (౨౧౦)

ఆ॥ నిత్య పూర్ణమగుచు సత్యంబు వెలుగొందు। నంచు పరమహంసు లెంచుచుండ్రు। గానవదియుబొందరు ఘనులు మెల్లనువారు। రఘు॥ (౨౧౧)

ఆ॥ సత్యమైన బయలు సత్యంబుగానమ్మి। నిత్యకర్మలందనిత్యబుద్ధి। నిల్పుకొని పరంబునిశ్చయింతురు బుధుల్। రఘు॥ (౨౧౨)

గీ॥ నల్లపిట్టలలోపలఁజెల్లనెఱుక। నిష్టగానమ్ము యోగులు నిపుణు లగుచు। నచల పదవిని బొందు దురవనిలోన। రఘు॥ (౨౧౩)

గీ॥ కంటిలోపల మెఱసెడు ఘనునిఁగనక। దృఢ తనుపవాస తపమాచరింప నేమి। ఫలము గన్పడుశుష్కాంగ ఫలముగాక। రఘు॥ (౨౧౪)

గీ॥ పురమున వసించు పురుషుని తెలుఁగు గనక। నొంటితనువును గారించుకొంటితపము। సేయునంతనె మోక్షంబుఁ జెందనగునె। రఘు॥ (౨౧౫)

ఆ తనువు విడువఁబడిన నణుమహత్పూర్ణత। నిండియాత్మ దానఖండరీతి। నుండునట్టి దాని నూహించికనవలె। రఘు॥ (౨౧౬)

ఆ॥ అచలమగుచు బ్రహ్మ మంతర్బహిర్వ్యాప్తి ।
నెనయఁగాంచు వారలెందుఁగలరు । తెలియఁ జూతు
మనుట వెఱ్ఱిమాటమొగాక । రఘు ॥ (౨౧౭)

ఆ॥ ఎఱుక బట్టబయలదేమియు లేదంచు । నూ
హ సేయరాదు సోహమనదను । మఱిగి యుండువారు
మర్మజ్ఞులరయఁగ । రఘు ॥ (౨౧౮)

ఆ॥ అచలమైనవస్తువంతట నొప్పారు । వెదికి వె
దికి చూడవివిధగతుల । భ్రాంతిశూన్యమైన పరిపూ
ర్ణమై యుండు । రఘు ॥ (౨౧౯)

ఆ॥ అంతరమున్న వెలుగునా బ్రహ్మమీక్షించు ।
చుండలేని మనుజులెందవాన । లందు నెండిఎడిసి నం
తనె ఫలమేమి । రఘు ॥ (౨౨౦)

ఆ॥ రూపురూపునందు రూఢిగాగన్పించు । రూ
పు దాపు లేని బయలు రీతి । నట్టి బయటి నరసి పట్టరే
దోషమో । రఘు ॥ (౨౨౧)

ఆ॥ కలను నరులాద[illegible]ాయమ్ములు మేన ।
గలవె మేలుకొన్నకడను విశ్వ । మరయ నెఱుక గన్న
నిరయమేమియు లేదు । రఘు ॥ (౨౨౨)

ఆ॥ ఏమిలేని దెఱిఁగి యేకాగ్రబుద్ధినై । సోహ
మనిన పల్కు నూహ నిల్పి । నిష్ఠతోడఁజూడ నిండును
బ్రహ్మంబు । రఘు ॥ (౨౨3)

ఆ॥ రూపరహితమగుచు రూఢిగా మెఱయును ।
బయలుగాదు బట్టబయటియూహ । యట్టిరూపమె
ఱిఁగిపట్టిన పరమొందు । రఘు । (౨౨౪)

గీ॥ కంటిపాపలనడుమను గలుగుకాంతి । గనిన వారలు కైవల్యగరిమగాంతు । రంచుఁబలుకుదురవని లో నార్యజనులు । రఘు ॥ (౨౨౫)

ఆ॥ జగములన్ని యొక్క మొగిఁగూర్చి చూచిన । నేమిలేకతుదకునెఱుకర్థయుండు । నెఱుకవీడగట్టి యెఱుకయే బ్రహ్మంబు । రఘు ॥ (౨౨౬)

ఆ॥ బట్టబయలుగుఱుతుపరమని జెప్పిన।వాడె పరమగురుడు వసుధయందు । నంచు దెలియు బలికి రార్యులెల్లప్పుడు । రఘు ॥ (౨౨౭)

ఆ॥ తత్వమనిన వేరుతలపునలేదని । యరస్వియాత్మవేత్తలెఱుఁగుచుందు । రట్టులెఱుఁగ రేని యరుదు సాయుజ్యంబు । రఘు ॥ (౨౨౮)

గీ॥ అజపగాయత్రి మంత్రంబు ననుదినంబు । జపముఁజేయుచుదానందుజతనమొనసి । పరము తానైన వాడెపో పడయు ముక్తి । రఘు ॥ (౨౨౯)

గీ॥ అజపగాయత్రిఁదీక్షనిర్మించునతడె విప్రు । డనుచు నుపనిషదుక్తుల యర్థమిట్టు । దంచు పెద్దలు తెలిపిరి యనవరతము । రఘు ॥ (౨30)

ఆ॥ అణు మహాత్తులెఱిఁగి యానంద మొందక । వేదములబఠించు విప్రజనము । చదువు మాత్ర దమకు సారమేమిలభించె । రఘు ॥ (౨3౧)

ఆ॥ కాయమందునున్న ఘనుని శోధింపక । విద్యలనుచు వెట్టివిట్టువీగు । వారికెట్లు ముక్తివైభవమొనగూడు । రఘు ॥ (౨౨3)

ఆ॥ ఇంద్రియములనెల్ల నేమేమొకప్టించి । పట్టఁ జూచుగాని పట్టుటరుదు। అచలమందు జేర్పనంతకష్ట మదేల ।రఘు॥ (౨౩౩)

గీ॥ వాయువు నిరోధమొనరింప మాయదెగునె। కాయమంతయు శుష్కింపఁగష్టపడుచు । నెంతతప మాచరించిన నేమిఫలము ।రఘు॥ (౨౩౪)

ఆ॥ బ్రహ్మమెపుడు బట్టబయలగుచుండంగ। వెదుకదిరుగు వెఱ్ఱివేల్పులనుచు । తిరిగినంతలోన దొరకునా మోక్షంబు । రఘు॥ (౨౩౫)

గీ॥ యజ్ఞదానాది వ్రతనిష్ఠలరసిచూడ । జననమరణంబు లొందించుననుగాని । జన్మవార్ధికివరిఁ జా పఁజాలవెందు । రఘు॥ (౨౩౬)

గీ॥ ఎన్ని చదువులుచదివిన నేమిలాభ । మాత్మలోనున్న బ్రహ్మంబు నరయకున్న । తన్నెదెలియని చదువులు సున్నగాక । రఘు॥ (౨౩౭)

ఆ॥ అరయ నన్ని విద్య లభ్యసింపగవచ్చుఁగాని బ్రహ్మవిద్యఁగరువవశమె । గురుని కరుణఁగననిగుణహీనులకునెల్ల । రఘు॥ (౨౩౮)

ఆ॥ అయిదు నాల్గు స్రోవలనిశంబు బంధించి । చూడఁజూడఁగళలు సొంపు మిగులు । మిగిలియున్న తత్వమేనీవని తలంతు । రఘు॥ (౨౩౯)

ఆ॥ కనులహృదయ కమలకర్ణికయందున్న। స్వామివనుచు నిన్నుసన్నుతించి।మ్రొక్కివేడుచుంటి మక్కువమీరంగ।రఘు॥ (౨౪౦)

ఆ॥ ఎఱుకు తెలుపునలుపు నెనయించి మెఱయు
న । విద్యకవలవెలుఁగు విశ్వనాథు। జూచి ద్రొక్కుఁడు
నిను చోద్యంబుగామది । రఘు॥ (౨౪౧)

గీ॥ విశ్వతైజస ప్రాజ్ఞులవిధముదెలిసి । మూఁడు
దేహంబులందును మోహపడక। తన్నెల్ల తుఁరీయాత్మ
డవని తలఁతు నిన్ను । రఘు॥ (౨౪౨)

గీ॥ రెండుపాధులలోపల నిండియున్న । బయలు
బ్రహ్మంబటన్న సద్భావమెంతు । గంతుఁదిలకింతుఁ
బులకింతుఁ ఘనతఁగాంతు । రఘు॥ (౨౪౩)

గీ॥ పండువెన్నెల యీబట్టబయలు గాంచి। యది
యదానన్నవారికి నాత్మయందు । బూజలోనరింతుని
న్నెంతుఁ బూర్ణుడవని। రఘు॥ (౨౪౪)

ఆ॥ పాపపుణ్యములను భ్రమతను దప్పించి తేప
తేపకెఱుకదీప్తిగాంచి। పాపలంటదు శుద్ధపరమంబు
నీవంటి । రఘు॥ (౨౪౫)

ఆ॥ ఎఱుకచేత మన్ననిష్ఠలేర్పాటఁసేయుదు। ఎ
ఱుకబయలుగలయ నెఱుకలేని। యద్దెచూడఁ బర
మునను భవరూపమా । రఘు॥ (౨౪౬)

ఆ॥ ఎఱుక మరువజేవ్వడే పాపపుణ్యంబు । లత
నికంటవనచు శ్రుతులయందు। వినుచుకనుచు నిన్ను
విడువనాకది గూర్పు । రఘు॥ (౨౪౭)

గీ॥ జీవతనువులమూఁడింటి చిక్కుఁదెలిసి । బ్రహ్మ
తనువుల మూఁడింటి పద్ధతిగన । వీనికవ్వలసాక్షి వి
వేకదయ్య । రఘు॥ (౨౪౮)

ఆ॥ సాక్షిసాక్షియనిన సాక్షివేరేలేదు । ధరణి
నెఱుక నెఱుగునెఱుకసాక్షి యట్టిసాక్షి రూపమచ
లంబునీవందు । రఘు ॥ (౨౬౯)

గీ॥ పరమపురుషుఁడ వీవటి భక్తినిన్నుఁ । బూజ
లొనరించి నిన్నెంతుఁ బూర్ణశక్తి। నన్ను్యేడను గాను
బ్రోవవె యచల రూప । రఘు॥ (౨౭౦)

ఆ॥ రెండుకనులలో నఖండరూపముతోఁడ।నిం
దుకొన్నస్వామి నిన్నుఁదలఁతు । నెండ జేర్చి నన్నఖం
డరూపుని జేయు । రఘు॥ (౨౭౧)

ఆ॥ ముద్రలైదు నేకముఖముగఁ జూచిన । కాము
ముఖ్యులరులు గదలలేరు । గాలిలేక దివ్వెగదలునా
యెంద్రైన । రఘు॥ (౨౭౨)

ఆ॥ అచల భావమెఱిగి యంతయు దానైన । ఘ
నుఁడు కామముల మకడకుఁజిమ్ము । సర్వాశమును గా
లిబడఁ ద్రోయఁగలఁడొకో । రఘు॥ (౨౭౩)

ఆ॥ గురునిబోధఁ గ్నాని గుఱిసిల్వనేరదు । పుస్తక
ముల జదువఁ బొత్తుపడునె । తలపపోతపాలుతల్లిపా
లగునొకో । రఘు॥ (౨౭౪)

యోగపరతలేకయొనరునా మోక్షంబు । కర్మప
రతచేతఁ గష్టమింతె । వానలేకయున్న వరిపైరు పం
డునా । రఘు॥ (౨౭౫)

ఆ॥ క్రమత నెక్క ముక్తికడఁ జేరవలెగాని । యె
గయునేని తుదకునెక్కనశమె । మెట్లుపట్టులేక చె
ట్టెక్కఁదరమౌనె । రఘు॥ (౨౭౬)

ఆ॥ బ్రహ్మమందు మనసు బాగుగాఁదాకిన । నిం
ద్రియంబులెల్ల నెగయకడఁగు ॥ హరినిగన్న గజముల
డఁగకయుండునా । రఘు॥ (౨౪౭)

ఆ॥ అచలమందు హృదయమాత్మలీనత జెంద । కా
ఋగుణములెల్లఁ గడకుబాయు। ముంగిసగనిపాము ము
ణిగిపాఱిన యట్లు । రఘు॥ (౨౪౮)

ఆ॥ నిష్కళంకమందు నిక్కంబుగామది । నిల్పి
చూడఁజూడనిగ్గుదొరుకు । పెరుగు జనువఁదరువమరి
వెన్నదొరుకదే ।రఘు॥ (౨౪౯)

ఆ॥ అచలతత్వపరత నైక్యభావముగన । ధరస
మాయడాయ వెరపుఁగనదె । పాము గాంచి కోళ్ళు
పరుగెత్తిడాగదే । రఘు॥ (౨౫౦)

గీ॥ ఇట్టిభావంబుదెలిసిన నీశ్వరుఁడగు । నంచు
బలికెదరెప్పుడు నఖిలమునులు । వారిభావనదెలియరె
వ్వరుధరిత్రి । రఘు॥ (౨౫౧)

ఆ॥ అన్నిచోట్ల బ్రహ్మమగుపడుఁ దరిచిన । ను
వులయందు నున్ననూనెభంగి । పెరుగునందు ఘృత
ముపరగినరీతిని । రఘు॥ (౨౫౨)

ఆ॥ అచలరూపమహిమ యవధూతకేకాక । యి
లను కర్మతులకు నెఱుగనగునె । కమల గంధమళికిఁగా
క కప్పలకౌనె । రఘు॥ (౨౫౩)

ఆ॥ జన్మకారణమని జనులెల్లఁగర్మంబు । తెలియ
లేరదేమొ తెలివిమాలి।కర్మలెల్లవదిలికనవలె బ్రహ్మం
బు । రఘు॥ (౨౫౪)

ఆ॥ మూడునదులపైని మేడలో విలసిల్లు । ముడితేఁ
గూడ లేక మూర్ఖజనులు । పరులనుగువబల్కిఁ బట్టబో
యెదరేమొ । రఘు॥ (౧౬౫)

ఆ॥ అండ పిండ బ్రహ్మాండంబు లందెల్ల । నా
త్మనిండియుండు ననవరతము । సాక్షిగతితదన్యసాక్షి
నైయుండెద । రఘు॥ (౧౬౬)

ఆ॥ ఆరుమూడు గట్టి యనిశంబు నాలోని । యూ
రునొక్క తమ్మునర యుచుండు । నాద్యులైన యరు
ల నడఁగింపఁగోరెద । రఘు॥ (౧౬౭)

ఆ॥ తల్లినీవెయనుచుఁ దండ్రినీవంచును । భ్రాతనీ
వెయనుచు బ్రహ్మమనుచు । గురుఁడనీవెయంచుఁ గూ
ర్మితోఁ దలఁచెద । రఘు॥ (౧౬౮)

ఆ॥ అన్నివస్తువులను నన్ని శబ్దములలో । నన్నిక
ళలలోన ననవరతము । నిండియున్నబయలు నీవె బ్ర
హ్మంబంటి । రఘు॥ (౧౬౯)

ఆ॥ పంచభూతములను బంచాక్షరంబులఁ । బం
చవర్ణములను బద్ధతిగన । నేమికాదుబ్రహ్మ మింత
యు దానాను । రఘు॥ (౧౭౦)

ఆ॥ పైనిబయలుజూచి పరమాత్మ యనియెంచి । లో
నిబయలుజూచి లోకశూన్య । భావమెన్న తెల్వి బ
హ్మమైనిల్చును । రఘు॥ (౧౭౧)

గీ॥ అరయ నాఁగ్నేయ కమలంబు నందు మెరయు ।
దృశ్యమంతయు నెఱిగెడు దృక్కువంటి । దనియదీ
నికిసాక్షి నేననియఁగంటి । రఘు॥ (౧౭౨)

ఆ॥ కళలరహితమగుచు ఘనముగా మెఱసెడు। స్వామివీవటంచు సన్నుతింతు.। నిరుపమాన విభవని ర్గుణబ్రహ్మశ్రీ।రఘు॥ (౨౨౩)

ఆ॥ నెగడు కళలఁజూచి నిష్కళ-దున నిల్పి। నిల్పినట్టిఱెలివినిశ్చయించి। బ్రహ్మ మెఱుఁగువారు ప రమ యోగీంద్రులు। రఘు॥ (౨౨౪)

ఆ॥ గురుఁడువిష్ణుఁడంచు గురిమీరఁ దలఁచుచు। గురు పాదసేవ మఱువకేనను। బట్టుగొల్పి లేనిపు ట్టుకఁ జగతిలో।రఘు॥ (౨౨౫)

గీ॥ తాను సేనన కుఁడిన దాన్ని పేరె। యచలమనుచును మనసులో నరయువలయు। గానియెఱుకనుపే రొక ఘనము గాదు। రఘు॥ (౨౨౬)

ఆ॥ మొదల బోధజేసి ముదముతో సద్గురుఁ।డచలమెఱుఁగు భావమంతఁ దెలియ।జేసియెఱుకగాని శే షంబొసంగును। రఘు॥ (౨౨౭)

గీ॥ సాధనమొకింత లేనిసంసారమంద। సారతనుగాంచు ప్రాక్పుణ్యచయముకల్మి। గురుడె నైవ స్వరూపమణ గుఱుతుఁ దెలియు। రఘు॥ (౨౨౮)

గీ॥ శరణుశరణంచు గురుపాదసరసిజములు। మఱువకెప్పుడుఁ దలఁచెడిమౌని వరులు। ముక్తిగాంతురు నీపాదభక్తులగుచు। రఘు॥ (౨౨౯)

గీ॥ సాధనంబులునాల్గింటి సరణిఁదెలిసి। యచలమైనట్టి బ్రహ్మార్దాత్మమెఱిగి। లేనివారలు పుట్టువు లేని వారు। రఘు॥ (౨౩౦)

గీ॥ అరయఁబరిపూర్ణమగుచున్నబరముజెంద నే। యుకసాధనమగుటఁ దాఁరేర్పరించి। తగనెఱింగించు వారలు తత్వవిదులు। రఘు॥ (౨౨౧)

ఆ॥ ఆత్మతత్వమున్న నాద్యంతములుసున్న। మధ్యమంబుసున్న మహిమదెలియ। మూలమెఱుగకున్న ముక్తినిగనరన్న। రఘు॥ (౨౨౨)

ఆ॥ స్వాద[illegible]ని సంసారగహ్వానంబు। విడువ లేరు[illegible]। స్వార్థకంబునీదుసద్భక్తిఁగనరయో। రఘు॥ (౨౨౩)

ఆ॥ కూటి కొఱకుఁగాదె [illegible]టివిద్యలునేర్చి। విపిగుటకట వెఱ్ఱిగాక। విద్యయ[illegible]న నాత్మవేత్తృత్వమగుగదా। రఘు॥ (౨౨౪)

[illegible] దేహానివసితమ్ము సోహమ్ము జూడక। తీర్థయా[illegible] తుదకుముక్తిలేక మదవృతిఁ జెడుదురు। [illegible]ఘు॥ (౨౨౫)

ఆ॥ దేహముపుడిఁజేసి[illegible]నిమ్నగ్గ జేసిసోహమనెడిపరమ సూక్తి నెఱిఁగి యారుతమ్ములందు నర్పింప వలవదా। రఘు॥ (౨౨౬)

ఆ॥ సమతమించ నారుకమలము లందున్న। బ్రహ్మహంసయంచుఁ బలుకుచుండు। బలుకుచున్నహంసఁబరికించి కనవలె। రఘు॥ (౨౨౭)

ఆ॥ స్త్రీల జూచినపుడె చీకాకు పడుదురు। కడుపులోని రోతగానలేరు। ప్రకృతిలోనివారు పరమెట్లు గాంతురు। రఘు॥ (౨౨౮)

ఆ॥ రామనామజపములవ్వంత యాత్మలో । సిలి
పి తలపలేరు నిమిషమైన । రామ నామ మహిమ ర
హి జెప్పుదును గాని । రఘు ॥                    (౨౮౯)

ఆ॥ మాయలోనఁబుట్టి మాయలోఁబెరిగియు ।
మాయలోనడంగి మనుజులకట । మాయఁదెలియ లే
కమఱిగి రా మాయనే ।రఘు ॥                    (౨౯౦)

గీ॥ వింటిబద్ధలక్రింక్రైన వీధిలోన । నాల్గురంగు
ల కావల నాటియున్న । వెలుగుఁజూచిన వారె కా
వేత్తలండ్రు । రఘు ॥                    (౨౯౧)

ఆ॥ నల్లగుంటనట్టనడుమను విలసిల్లు । పిల్లమీద
చాలఁ బ్రీతిగల్గి । కల్లరీతి బ్రకృతిఁగాంచు చె బ్రహ్మం
బు । రఘు ॥                    (౨౯౨)

ఆ॥ అండపిండ పద్మజాండములోవెలి ।నాత్మఁజూ
డలేని యజ్ఞులట్లు । చూచువారి నెల్లఁ జులకనఁజూతు
రు । రఘు ॥                    (౨౯౩)

ఆ॥ హృదయ కమలమందు నీశ్వరుండువసించు ।
గాసిలోనఁ గానికానరాడె । కాసికేగువారు గందురే
పరశివు । రఘు ॥                    (౨౯౪)

గీ॥ ఉదక తేజంబులనుఁ రెంటినూహచేత । సు
షిరమునఁ దిప్పినిల్పెడు సూటిదెలిసి । దానికూర్ధ్వ
పరంబు దాబూనవలెను । రఘు ॥                    (౨౯౫)

గీ॥ పంచ దశిమంత్రవర్ణ తాత్పర్యమెఱిగి । షోడ
శాక్షరి మంత్రంబు సూటిదెలిసి। ద్వాదశాక్షరిఁదె
లిసినద్దైవమతఁడె । రఘు॥                    (౨౯౬)

ఆ॥ ఇంతకన్న సూక్ష్మమీ మహిలేదని । కోరజె
లిసికొంటి గురునికరుణచే । గరుణతోడ బ్రోవుకమల
సంభవనుత । రఘు॥ (౨౯౭)

గీ॥ ఆశలడగించి యీగ్రంథమచలమగుచు । నె
ప్పసుజ్ఞానులగువారికొప్పిదముగ । నిట్టిగ్రంధంబుఁ జే
కొనుమింపుతోడ । రఘుకులాంబోధి సోమ శ్రీరామ
నామ ॥ (౨౯౮)

ఆ॥ గురునికరుణచేతఁ గూర్చితిగ్రంథంబు । త
ప్పులున్ననవియు నెప్పగాగ । మెప్పుఁజేసి బ్రోవుమీ
నిన్ను వేడెద । రఘుకులాబ్ధి సోమరామనామ॥(౨౯౯)

ఆ॥ సత్యరూపుఁడైన సాక్షినిజూడని । నిత్యకర్మ
జాలన్నిరతులకట । ప్రత్యగాత్మలగుచు బరమెట్లు గం
దురు । రఘుకులాబ్ధి సోమ రామ నామ ॥ (౩౦౦)

ఆ॥ ఇట్టిపద్యవితతి నింపుతోఁజదివిన । పుణ్యుల
కుఁ ద్వదంఘ్రి పూర్ణభక్తి । భుక్తి ముక్తియుక్తి
ముక్తియుఁ జేకూర్పు రఘుకులాబ్ధి సోమ రామ
నామ ॥ (౩౦౧)

ఇది శ్రీయాజ్ఞవల్క్య శాఖోత్పన్న కాశ్యప సగోత్ర
పవిత్ర రెడ్డివంశ క్షీర పారావార రాకాసుధా
కర బ్రహ్మయామాత్యపుత్ర శ్రీజగద్గురువిశ్వ
నాథావధూతాచార్య శిష్యవర్య సుజన
విధేయ సుబ్రహ్మణ్యనామధేయ ప్ర
ణీతంబగు నద్వైత రహస్యంబను
వేదాంత గ్రంథము, సంపూర్ణము.

శ్రీగురవేనమః

# ప్రకటనపత్రిక.

శ్రీమచ్చెన్నపురంబున పెద్దినాయని పేట నాటుపిళ్లారి గుడి వీధి కవాటు సంఖ్య (౨౦) గలయింటను విక్రయింపంబడు వేదాంతగ్రంథముల వివరము.

| | వెలలు | | పోష్టేజి | |
|---|---|---|---|---|
| | రు - | అ | అ - | పై |
| సుజ్ఞానదీపమను గురుగీత ౨౬౪ శ్లోకం... | ౧ | ౮ | ౧ | ౦ |
| శ్రీశివరామదీక్షితీయమను అచల గ్రంథము | ౧ | ౦ | ౧ | ౦ |
| శుద్ధనిర్గుణకందార్థ దరువులు తాత్పర్యంసహా | ౦ | ౧౨ | ౧ | ౦ |
| శ్రీకృష్ణబోధామృతము, ౧౨ రాజులకథలు | ౦ | ౧౨ | ౧ | ౦ |
| శ్రీకృష్ణోద్ధవ సంవాదమను పరమపదమార్గము | ౦ | ౮ | ౦ | ౬ |
| శ్రీరామహృదయమను ఇంద్రజాలపుకథలు | ౦ | ౮ | ౧ | ౦ |
| వసిష్ఠజనకసంవాదము, అతీతమార్గగ్రంథం | ౦ | ౮ | ౧ | ౦ |
| శుకపంచవింశతియను ౨౫ - కథలు ... | ౦ | ౮ | ౧ | ౦ |
| సుజ్ఞానరత్నావళి, ౧౦౮ వేదాంతకీర్తనలు | ౦ | ౬ | ౧ | ౬ |
| భక్తవిజయమను ౧౦ మహాపతివ్రతలకథలు | ౦ | ౬ | ౦ | ౬ |
| ఉషాపరిణయము, వచనకావ్యము ... | ౦ | ౬ | ౧ | ౬ |
| శ్రీకృష్ణ నృగు మహారాజు ప్రహ్లాదము | ౦ | ౪ | ౦ | ౬ |
| యోగానంద చరిత్ర, యక్షగానము... | ౦ | ౪ | ౦ | ౬ |
| అద్వైత రహస్యము ... ... | ౦ | ౪ | ౦ | ౬ |
| ఆత్మవిలక్షణసారమను గ్రంథము ... | ౦ | ౩ | ౦ | ౬ |
| ఆంధ్రపంచీకరణము ... ... | ౦ | ౩ | ౦ | ౬ |
| బసవశతకము, వేదాంతము ... ... | ౦ | ౧ | ౦ | ౬ |

ఈరిజిష్టరు గ్రంథముల కొనెడు వారలకు రు ౧౧౦ ...కి రు ౧౦-వంతున కమీషన్ (అనగాలోని) యివ్వబడును. రు ౧౧-కు తక్కువగా కొనెడు వారలకు కమీషన్ ఈయబడదు. తపాలాబిళ్లలు పుచ్చుకొబడవు.